# శ్రీరామజననము.

ఇయ్యది.

మ॥ రా॥ రా॥ ద్రోణమరాజు సీతారామారావుగారిచే

రచియింపఁబడి,

రాజమండ్రివాస్తవ్యుఁడు బుక్కుసెల్లరునగు

## కర్రి అచ్చయ్యచేఁ

ప్రకటింపఁబడినది.

---

మొదటికూర్పు, 1000.

---




స్కేప్ అండ్ కంపెనీ ముద్రాక్షరశాలన్ముద్రితము.

1914.

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.

దశరథుఁడు—అయోధ్యాపురాధీశ్వరుఁడు.

సుమంత్రుఁడు—మంత్రి.

సుమంతుఁడు—రథసారథి.

వసిష్ఠుఁడు—ముని.

ఋషి.

ఋషిబాలుఁడు.

దేవేంద్రుఁడు—అమరాధీశుఁడు.

బృహస్పతి—దేవగురువు.

జయంతుఁడు—దేవేంద్రునిసుతుఁడు.

రావణుఁడు—లంకాధిపతి.

మేఘనాధుఁడు—రావణునిసుతుఁడు.

నలకూబరుఁడు—కుబేరుని సుతుఁడు.

విష్ణుమూర్తి,

అగస్త్యుఁడు }
దుర్వాసుఁడు } మునులు.

జయంధరుఁడు—దేవదూత.

—స్త్రీలు.—

ఋషిభార్య.

రంభ—అమరవేశ్య.





# శ్రీరామజననము.

## నాంది.

మ॥ ధరణీభారనివారణంబునకు దై ♦ త్యశ్రేణిఁ గూల్పన్ బ్రభా
కరవంశాంబుధిచంద్రుఁడై దశరథ♦క్ష్మాజాని గర్భంబునం
దరయన్ జన్మముగాంచినట్టి ఘనమా ♦ యామర్త్యరూపుండు శ్రీ
హరి రాముం డిడుఁగాత మీకుఁ గృపఁ గ♦ల్యాణంబు లెక్కాలమున్.

తే॥ గీ॥ శ్రీయుమాపతీనాయక ♦ సేవితంబు
మౌనివర్యుల పాలింటి ♦ పాలవెల్లి
యఖిలరోగముల్ వాప ది♦వ్యౌషధంబు
రామమంత్రంబు మిమ్మెప్పు ♦ డోముఁగాత.

(నాంద్యంతమున)

సూత్రి:—(సభ్యులపైఁ బుష్పాంజలి జల్లి)

తే॥ గీ॥ మొదట గీర్వాణభాషలోఁ ♦ బుణ్యమూర్తి
రామచరితంబు నెవ్వఁడు ♦ వ్రాసె నట్టి
వామలూరుసంభవుని స♦ద్భక్తి మీఱ
మనమునందున వినుతింతు ♦ బ్రస్తుతింతు.

అతివిస్తరంబేల ? (తెరవంకఁ జూచి) కుంకుమతిలకాంచితభ్రుకుటీ ! నటీ ! నీ యలంకారము పూర్తియైనచో నొక్కసారి యిటురమ్మ.

నటి—(ప్రవేశించి) ఆర్యా ! ఏమి సెలవు ?

సూత్రి—తే॥ గీ॥ సరససంగీతసాహిత్య ♦ శాస్త్రనిపుణ
శేముషీ ధురంధరులయి ♦ చెలఁగుచుండు

సజ్జనప్రకర మదిగో ♦ సభ్యులగుచు
వెలయుచున్నారు కంటివే ♦ వెలఁదిమిన్న.

నటి—ఈసభలం జూచినంతనే నా కధికోత్సాహము జనింపుచున్నది. కాని వీరిరాకకు మాత్రము కతం బెఱుంగఁజాలకుంటిని.

సూత్రి—ఇంతమాత్రము కనుంగొనలేకపోయితివా?

మ॥ మనువంశాంబుధిచంద్రుఁడై దశరథ♦త్మాజాని గర్భంబునన్
మునులున్ దేవతలున్ మనంబులను స♦మ్మోదంబునుం బొందగా
ఘనులన్ దైత్యులఁగూల్పఁ బుట్టిన జగ♦త్కల్యాణుఁడౌ రామరా
ట్జననం బాడి ముదంబు గూర్పుమనిరో ♦ సంపూర్ణచంద్రాననా.

నటి—సాక్షాద్విష్ణు స్వరూపుండై ధరాభారము వాపనెంచి జన్మించిన శ్రీరామచంద్రుని పవిత్రజననకథానిధానంబును నాడినచో మనము కృతార్థులమగుదుము. మనోహరా! ఇక్కథను రచించి తనజన్మమును సార్థక పఱచుకొన్న కవియెవ్వరు?

సూత్రి—అనేక దృశ్యప్రబంధకర్తయగు ద్రోణమరాజు సీతారామరాయాభిధానుండే దీనికి గర్త.

నటి—ఓహో! ఈతఁడా! ఈతనినాటకంబు లన్నియు నిదివఱకే జగత్ప్రసిద్ధి వహించి యున్నవి. ఇయ్యది ప్రదర్శించి సభ్యులను నానందాబ్ధిలో నోలలాడింపవచ్చును.

[తెరలో]

మ॥ వరనిష్ఠాపరులై తపం బెపుడు శం♦భద్భక్తినింబూని, శ్రీ
తరుణీనాథునిగూర్చి చేసెడి మునీం♦ద్రశ్రేణి హింసించు భీ
కరసింహప్రముఖాదిక్రూరమృగవ♦ర్గంబున్ వధింతున్ గదన్
ద్వరగాదోలు రథంబు నిప్పుడు సుమం♦త్రా! సంతసంబూనుచున్

సూత్రి—ఇంకమన కీమాటలతో నేమిపనియున్నది. అదిగో! సరయూనదీతీర ప్రాంతారణ్యంబున వేఁటాడుటకై దశరథుఁడు వచ్చుచున్నాఁడు. ఇంక మన మిచ్చట నుండరాదు. పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---



# శ్రీ రా మ జ న న ము.

## ప్ర థ మా ం క ము.

### సరయూతీరము.

[అంత నై పద్యమును జదువుచు సారథియగు సుమంతునితోడ దశరథుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దశ — సారథీ! ఏమి. నీరథచోదకము.

తే॥ గీ॥ హర్మ్యతలంబెల్ల క్రిమ్మఁగి ♦ సారె కరణి
దిరుగుచుండెను గిరగిర ♦ ధరణిజములు
వెంటవచ్చెడిభాతి గా♦న్పించుచుండె
వాయువేగంబు నెగదన్ని ♦ పరలుచుండె.

(ఇంచుకయూరకుండి) సుమంతా! ఈమందమారుత సౌఖ్యంబు గంటివా! మార్గాయాసంబున డస్సియున్న పాంథులచిత్తంబును నిది యెంతయో రంజిల్లఁ జేయును గదా! ఈ గాలిసౌఖ్యంబును నాబోటి మహారాజెఱుంగుట దుర్లభంబు.

చం॥ తెలతెలవాఱనీయకయె ♦ తీయనిచద్దిగలట్టి మూటలన్
గడువడిగా భుజంబునను ♦ గాంతుమెఱుఁగ్ దగదాల్చి; వేడ్కతోఁ
బొలమున కేగి, యంతటను ♦ బొందుగ దుక్కిని దున్ను రెడ్డు లీ
మలయసమీరసౌఖ్యమును ♦ బాగుగఁ బొందుదురుసుమ్మి సారథీ.

ఇది యట్లుంచుము. నేత్రపర్వంబై యొప్పు నీనదీతీర మెంతసొంపుగ నున్నదో చూడుము.

సీ॥ జలచరంబులఁ బట్ట ♦ జపమునొనర్చెడి
దొంగతాపసులైన ♦ కొంగగుంపు
ఇచ్చోట నచ్చోట ♦ నింపుగా మేయుచు
నీళ్ళకై యరుదెంచు ♦ లేళ్ళసమితి
కలకలారావంబు ♦ సలుపుచు నిచ్చోట
నచ్చోట జేరు వి♦హంగచయము
అలసియుండినవారు ♦ హాయిగాఁ గూర్చుండఁ
దనరుచుండిన సైక♦తస్థలములు
తే॥ గీ॥ గలిగి వివిధచిత్రములచేఁ ♦ జెలఁగుచుండి
యంచితానందమును గూర్చు ♦ నాత్మకిపుడు
భళిర సరయూనదీతీర ♦ భవ్యచిత్ర
మెన్నఁ దరమానె భువిలోన ♦ నేరికైన.

(తెరలో)

మ॥ శరభంబుల్ బులులున్ యెలుంగులు మహా♦శార్దూలముల్ రేగి చె
చ్చెర ఘోరాటవిజొచ్చి బొబ్బలిడుచున్ ♦ జీకాకుచే మాపయిన్
గురుకోపంబున దూకుచున్నయవి యా ♦ ఘోషించుటాలించి నీ
శరణై పుణ్యము చూపుమీ దశరథ♦క్ష్మాపాలచూడామణీ.

దశ — సుమంతా! మనకై వేటకాండ్రు తొందరనొందుచున్నారు. తేరు నరణ్యంబు లోనికిఁ బోనిమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

రంగము—అరణ్యము.

[ధనుర్ధరుఁడై దశరథుఁ డొంటిగాఁ బ్రవేశించుచున్నాఁడు]

దశ—తనలో

ఉ॥ కానల జెట్లనీడలను ♦ గాంక్షమెయిన్ దపమాచరించు స
న్మానులు జెందుబాధలను ♦ మాన్పి మొకంబులద్భుంచి వారి యా
నూనకటాక్షమందితిని ♦ నొప్పగ ధన్యుఁడనై తి నిం కిటన్
నానగరంబుఁ జేరెద మ♦నంబున సంతసమొందుచున్ ద్వరన్,

(నలుదిక్కులు బరికించి) ఓహో ! దారితప్పితినికాఁబోలు. కంటి కొక్కభటుండైనను గానరాకుండెను. సుమంతుఁడు నన్ను వెదకుచు నుండనోపు. ఇప్పుడు నేనేమి సేయుదును. పురంబునకు నొంటిగ నెట్లుపోగలుగుదును. (ఆకాశమును జూచి) అదిగో ! త్రిమూర్త్యస్వరూపుండై యేమహాత్ముండు జగంబు నెల్ల గృపావృష్టిని వీక్షించుచుండునో, ఏమహాత్ముని దివ్యనామ సంస్మరణంబు సమస్తరోగంబులను బాపునో, ఏమహాత్ముని గొలుచుటం జేసి, సకలభక్తులును నభీష్టార్థసిద్ధు లగుదురో! యట్టి దివాకరుం డస్తగిరిం జేరుచున్నాఁడు. ( ఇంచుక యూరకుండి ) ఆహా ! చీఁకటి పడిపోయినదే.

[తెరలో బుడబుడధ్వానంబు వినవచ్చును]

దశ—(నలుదిక్కులు బరికించి) ఏమి ! యీధ్వని

[మరల నదియే ధ్వనివినవచ్చును]

దశ—(ఆలోచించి) సరే ! తెలిసినది. ఈ చప్పు డాచాయనుండి వినవచ్చుచున్నది.

తే॥ గీ॥ మదపుటేనుఁగ యొక్కటి ♦ మహిమయెసఁగ
జలముగ్రోలుచు నిప్పడీ ♦ శబ్దమిట్లు
సేయుచున్నది కావున ♦ శీఘ్రగతిని
బాణమును వీడి దాని దర్పం బడంతు.

ఆమదకరీంద్రము నీరమున గ్రోలు నగుశబ్దమే యిది. అందుకు సందియంబు లేదు, (ఇంచుక ముందుకు నడచి) ఇంక నాలోచింప నేల!

[అని శరప్రయోగము సేయుచున్నాఁడు]

[తెరలో]

హా! ఎంత క్రూరకృత్యం బాచరించితివిరా ?

దశ — (నిశ్చేష్టితుఁడై) ఆహా! తానొకటితలంప దైవ మింకొకటి చేయు నన్న పలుకు సత్యమయ్యెనుగదా! అక్కటా! హస్తియని తలంచి మనుజునిపై శరంబు విడిచితి. ఎంత ఘోరపాపంబునకుఁ బాల్పడితిని. హా! పరమేశ్వరా! ఇది నీవు నాచేఁ జేయించిన ఘోరపాపంబువలెనే యున్నది. మహానుభావా!

తే॥ గీ॥ మదవుఁటేన్గు నెదుటఁ బెట్టి ♦ మహితశరము
చేయి జారఁగఁగల్పించి ♦ చేసినావు
భూరిమర్త్యుగా నాకొంప ♦ ముంచినావు
నింక నెయ్యది సేయంగ ♦ నెంచినావొ.

అయ్యో! ఇప్పుడు నేనేమిచేయుదును. చేయుట కేమున్నది. నాశరంబుచే నేలఁబడిన యాపురుషుని సన్నిధికిం బోయి, తగిన యుపచారం బాచరించెద. (అని నడచి పడియున్న మునిబాలుని జూచి) అక్కటా! నే నింతవఱకును సామాన్య మర్త్యుండని తలపోయుచుంటి. ఈతం డొకమునిబాలుఁడు.

తే॥ గీ॥ కాననంబులయందుండి ♦ కందమూల
ఫలముల భుజింపుచుండి దై ♦వంబుగూర్చి
తపము నిరతంబుఁ జేసెడి ♦ తపసిపుత్రు
గాసిజేసితి పాపంబు ♦ గట్టికొంటి.

తే॥ గీ॥ అకట తాపసోత్తములు శా♦పాయుధు లివు
డీతఁ డెట్టిశాపంబును ♦ నిచ్చువాఁడొ
కుడిచి కూర్చుండఁగాలేక ♦ కొంపపైకి
నేనె తెచ్చికొంటి నిప్పు ♦ డేమిసేతు.

ఋషిబా—(తనలో) అక్కటా! ఇదియేమి. ప్రారబ్ధము. మునిబాలుఁడనైన నాపైననె వ్వఁడు బాణంబు విడిచెను. నరసంచారములేని యీనట్టడవిని చీఁకటి సమయంబున నీటికి వచ్చితి. నాపై శరంబు విడిచినవారికి నేనేమి యొగ్గు సల్పితినో కదా! అయ్యయ్యో! జటాభారంబుదాల్చి మునినై కందమూలఫలంబుల భుజింపుచు భగవధ్యానము చేసికొను నేనేడ, ఒక్కమనుజునిచేఁ గూల్పఁబడుటేడ. అక్కటా! నామృతికి నేను వగవనుగాని, వృద్ధులయిన నాజననీ జనకులం గూర్చి మాత్రము విచారింపుచుంటి. హా! జననీ జనకులారా! అంధులైన మీ రెవ్వనిని నమ్ముకొని తపం బాచరింపుకొనుచుఁ గాలంబు గడపుచుంటిరో, య ట్టి మీ యనుంగుఁబుత్రుఁడు నేఁడు దిగం బలంకరింపుచున్నాఁడు. మీ కిన్ని నీళ్ళు చుక్కలు పోయునని నమ్మియుంటిరిగాని మీరే నాకుఁ బోయవలసివచ్చునని కలనయినం దలంపరయితిరికదా! తల్లిదండ్రులారా! మీకింక శుశ్రూషజేయువా రెవరు? మీకు గతి యేమి? (విలపించుచున్నాఁడు.)

దశ—ఈతని సముఖంబున కేగి నాసంగతినంతయుఁ దెలిపి, క్షమింపవేఁడుకొనెద. (ఋషిబాలుని సమీపించుచున్నాఁడు)

ఋషిబా—(దశరథునిజూచి)

ఉ॥ ఎవఁడవురోరి నీవిటు లోకింత మనంబున నెంచకుండ శ్రీ
ధవుని నిరంతరంబు మది ♦ ధర్మవిధిన్ భజియింపుచున్ మహో
త్సవగతి గానలన్ నిలచు ♦ సన్మునిపుత్రుని నన్ను గూల్చి నీ
వు వడయులాభ మేమిపుడు ♦ పొందుగఁ దెల్పుము దుర్మదాంధమా.

నీయున్న తెఱంగు జూడ నీవొక భూజానివని తోఁచుచున్నది. అయ్యయ్యో! జాత్యంధులైన మాతలిదండ్రులు, దాహంబుగొని జలంబుదెమ్మని నియోగింప గడురయంబునఁ గొనిపోఁదలఁచితిని. ఇప్పుడు నీబాణముచేఁ గూలినాఁడ.

తే॥ గీ॥ దప్పిగొనినారు నాతల్లి ♦ దండ్రులకట
నీరమెప్పుడు తెత్తునో ♦ నే నటంచు
నెదురు జూచుచునుండెద ♦ రెంతయైనఁ
గటకటా యేమిచెప్పుదు ♦ ఘోరతలేంద్ర.

చ॥ నడువఁగ గాళ్ళులేవు నయ♦నంబుల దృష్టియులేదు దాహముం
గడుగొని నన్నుఁగూర్చి కొ♦డుకా కొడుకా యని యేడ్చుచుందు రి
ప్పుడు గృహమందు నీవికను ♦ బొందుగ నీరము గొంచుఁబోయి వా
రలకునొసంగి నాదగు తె♦లుంగు వచింపు మసత్యమాడకన్.

దశ — మునిబాలకా! నేనెంతయైన ఘోరపాతకంబు గట్టికొంటిని. బుద్ధిపూర్వకముగఁ జేయలేదు.

మ॥ రవివంశంబున జన్మమందియు మహా♦రాష్ట్రంబు సాకేతముం
భవుకవ్రీతిని నేలుచున్ జనములన్ ♦ బాలింపుచున్ వేడ్క శ్రీ
ధవునిం గొల్చెడి నిన్నుఁ జంపితి వృథా ♦ ధర్మైకహీనుం డటం
చవనిం బేర్పడనయ్యె నాదుబ్రతు కా♦హా వ్రాత యిట్లొప్పెనే.

ఋషిపుత్రా! నీవు కుండముంచుశబ్దం బాలించి గజంబు నీరంబు గ్రోలుచున్నదని తలంచి యీరీతి నిన్నుగాసి జేసితిని.

ఋషిబా — ఓహో నీవు దశరథుండవా!

ఉ॥ మించినదానికిన్ వగవ ♦ మేలగునే యిఁకరాజ! బాణముం
దృంచితివీవు నన్నిపుడు ♦ తృష్ణకువచ్చిన హాస్తియంచుఁ జిం
తించిన లాభమేమి యిఁక ♦ దిన్నఁగఁ దండ్రినిజేరి వేగ వి
న్పించుము నాదువార్తను వి♦వేకగుణుండు నినున్ క్షమించెడున్.

ముందు నీవు ఘటోదకంబును గొనిపోయి నాకై వేచియున్న మాతలిదండ్రుల తృష్ణంబాపి యీపైన నావార్తను దెలుపుము. నిజంబు వక్కాణించితివేని యాతండు నిన్ను దప్పక సైరించును. అట్లు చేయవైతివేని నాకై గుట్టగుట్టయు నెమకి తుదకు దివ్యదృష్టిని నాయందంతంబు కనిపెట్టి భవత్కులంబు దహియింపఁ జేయును. కావున నావాక్య ప్రకారం బాచరింపుము. ఇంకనీవు సందియంబందక ప్రయోగించిన శరంబును నాశరీరంబునుండి తీయుము. ప్రాణంబులు విడిచెద.

(దశరథుఁడు మునిబాలుని శరీరంబునుండి శరమును దీయగాఁ బ్రాణంబులను విడుచుచున్నాఁడు) దశరథుడు నిష్క్రమించును.

రంగము—ఆశ్రమవాటిక.

[ప్రవేశము ఋషి, భార్య.]

ఋషి—తే॥ గీ॥ ఎంతయోకాల మాయెను ♦ నింతి సుతుఁడు
జలము దెత్తునటంచును ♦ సరయుకేగి
యింతవఱకును రాడాయె ♦ నేమిసేతు
నెన్నఁ డింతయాలస్యంబు ♦ నెఱుఁగఁడకట.

అయ్యో! దాహం బధికంబుగనున్నది. పుత్రుండు చీఁకటిలో నేగినాడు. ఏమైయుండు నోకదా! నాడెందంబు సంతాపంబందుచున్నది. ఏమికీడువాటిల్లనున్నదోకదా. మనలనువిడనాడి యింతకాల మెచ్చటను నుండినవాఁడుకాడు.

[దశరథుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దశ—ఆమునిబాలుని జననీజనకులు వీరైయుండురు. అక్కటా! అంధులైన వీరిపుత్రునిజంపి యెంతపాపంబు గట్టికొంటిని.

ఉ. అక్కట మీకుమారు దును♦మాడితినంచును వీరితోడ, నే
నెక్కరణిన్ వచింపఁగల ♦ నిప్డు వచించిన హా యటంచు లోఁ
బొక్కరె పొక్కి పుత్రక మ♦ముఙ్ విడనాడితివేయటంచునున్
సొక్కరె శాపమిచ్చి నను ♦ శోకపరీతుని జేయరే మహిన్.

ఏమైననుసరే చెప్పకతప్పదు.

[ఘటోదకంబు వారిముందు బెట్టుచున్నాఁడు]

ఋషి—(చప్పుడువిని)

ఉ॥ కన్నులులేని మాకిపుడు ♦ కన్నులునీవెయటంచుఁ జిత్తమం
దెన్నుచునుంటి సంతతము ♦ నీవును నట్టులె చూచుచుంటచే
నన్నలినాప్తునిన్ మది న♦హర్నిశముఙ్ భజియించుచుంటి మో
కన్నకుమార నిన్విడచి ♦ కానలనుండుట శక్యమౌనొకో.

నాయనా ! ఎన్నఁడును నింతయాలస్యముచేసి యెఱుంగవు.

దశ — (మారుపలుకక యూరకుండును)

ఋషి — నాయనా ! పలుకవేమి ? నేను నిన్నిట్లంటిననికోపమా ! నేనుగాని నీమాత గాని నీయందున్న దోషంబుగన్పఱచినచో నయ్యది నీబాగునకేకదా వత్సా ! ఆగ్రహింపకుము.

దశ —

8

చ॥ సుతుఁడనుగాను మీకుఁ బరి♦శుద్ధచరిత్ర మహానుభావ నీ
క్షితి సకలంబునేలు నృప♦శేఖరుఁడన్ రవివంశజుండ, స
త్కౌతుకముమీర వేఁటకిట♦కున్ జనుదెంచి శరంబుఁ బూని నా
యతగతిఁ గూరుచుండఁగను ♦ నాసరయూనదితీరమందునన్.

బుడబుడధ్వని వినిపింప, కుండతో నీరంబులు ముంచుశబ్దమని తెలియక, వనగజంబని తలంచి, శరంబును బ్రయోగించి మీతనయునిగూల్చిన మహాపాతకుండ.

ఋషి&భార్య — హా ! కుమారా ! (అనిమూర్ఛిల్లుచున్నారు)

దశ — (తనలో) ఎంతకష్ట మెంతకష్టము.

ఋషి — (మూర్ఛనుండిలేచి)

మ॥ తనయా సద్వినయాంచితాభరణ స♦ద్ధర్మైకపారీణ, కా
ననమందిట్లు తపంబు జేసికొనుచున్ ♦ గాలంబునుంబుచ్చుచూ
కనిశంబున్ బరిచర్య జేతువనుచున్ ♦ హా ! యెంచితిన్ గాని నీ
కును నూరేండ్లు నిండునంచు మదిలోఁ ♦ గొంచెంబెఱుంగన్ గదా.

తే॥ గీ॥ ఇన్నినీళ్ళుచుక్కలు మాకును ♦ నిత్తువంచు
సంతసంబందితినిగాని ♦ సత్కుమార
బరఁగ నీకు నేనే పోయు♦వలయు నంచుఁ
దలఁపనైతిని నెప్పుడు ♦ తథ్యముగను.

భార్య — హా ! కుమారా ! కన్నులులేనిమమ్ము విడనాడి యేగుటన్యాయమా ! నీవు మమ్మిట్లు బాసిపోవ మాకెవ్వరుగతియగుదురని తలంచితివి.

ఋషి — తే॥ గీ॥ స్నానమాచరింప నెవరు ♦ సరయునదికి
నన్నుఁ దోడ్కొనిపోదురో ♦ కన్నకొడుక
బ్రతికినన్నాళ్ళు మానివాచు ♦ బ్రతికి తుదకు
మనుజుచేఁ గూల్పఁబడితివా ♦ మహితచరిత.

దశ — మహాత్మా! మీసుతుని నజ్ఞానవశంబునఁజంపితిని. ఈదురాత్ముని, పాపరతుని శిక్షించినను రక్షించినను మీదేభారము,

ఋషి — (దశరథునివిలోకించి) ఓరీ తులువా! వానప్రస్థునిజంపి రాజైనను దేవతానాధుఁడైనను నిల్వఁగలఁడా! నీవుచేసినపాపంబు నీవేచెప్పుకొనుటంజేసి బ్రతికిపోతివి. లేకున్నచో నీశిరము వేయువ్రక్కలై పోదా! ఓరీ! మహాపాతకవర్తీ! ఎఱుంగకచేసితివి గావున సరిపోయినది. లేకున్న నీవేగాదు రవివంశంబంతయు నంతరింపకుండునా! సుమతీ! ఇంక మేమాలస్యముసేయరాదు. శీఘ్రింబుగఁ జితినిబేర్పుము. మేమందు బ్రవేశించి మాకుమారుని గలిసికొందుము. ఆలస్యముసేయక మాయాజ్ఞ ననుసరింపుము.

దశ — హా! ఎంతకష్ట మెంతకష్టము. కుటుంబంబువంశను వధించినవాడ నైతినిగదా!

[నిష్క్రమించి వెంటనే ప్రవేశించును]

ఋషి — ఏమిరాజా! చితింబేర్చితివా!

దశ — మహానుభావా! ఈపాపపుహస్తంబు లందుకుఁగూడ నొడంబడినవి.

ఋషి — రాజా! ఇంకనీవు విచారింపకుము. తెలియక యిట్టిదోషంబుసల్పితివిగాన బ్రహ్మహత్యాపాతకంబు నిన్నొడిగట్టకుండుఁగాక. కాని,

తే॥ గీ॥ నాకు సుతశోకమును గూర్చి ♦ నావుగనుక
నీవు నావలె సుతునికై ♦ యేడ్చియేడ్చి
పాసెవ్వుదగాక ప్రాణంబు ♦ ఘోరతలమున
నిదియె శాపంబు నీకును ♦ నిచ్చినాడ.

ఇంక మేమేగి చితింబ్రవేశించెదము. (భార్యంజూచి) కాంతా! ఇంకమనముపుత్రుని గలిసికొందమురమ్మా. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము,



# శ్రీ రా మ జ న న ము.

## ద్వితీయాంకము.

[దశరథుఁడు—సుమంతుఁడు ప్రవేశము]

సుమం—దేవా! దేవరవారు నేఁడేమియో కాని దీర్ఘాలోచన తత్పరులై విచారభావంబుతో నున్నట్లు గానుపించుచున్నారు. కారణంబు దెలుపఁదగునేని సెలవీయఁగోరెద.

దశ—అమాత్యవర్యా! సుమంతా! నాకొండువిచారం బేమిటందును.

సీ॥ దేవతానాధుని ♦ దివ్యభాగ్యముకన్నఁ
గడుసంపదలుగల్గి ♦ క్రాలుచుంటి
భూమండలంబంత ♦ భూపాలురెల్లరు
నోలిసేవింపఁగా ♦ నేలుచుంటి
నవరత్నఖచితమౌ ♦ నవ్యసౌధములుండి
యెంతైన సుఖముచే ♦ నెగడుచుంటి
పరిపూర్ణగుణవతుల్ ♦ భార్యలుముప్పురు
నందింప భోగంబు ♦ లందుచుంటి

తే॥ గీ॥ దేనికినిగొఱఁతయే లేక ♦ దివ్యమతిని
దనరుచుంటిని నిరతంబు ♦ ధరణిపైన
గాని యొక్కసంతాన సౌఖ్యంబులేక
పోయెనంచును మదిలోనఁ ♦ బొగలుచుంటి.

సుమం—భూపురందరా! అందుకుఁ దగినయత్నంబు వసిష్ఠమహామునితో నాలోచించి యేదియేని నొనరింతము.

దశ — మంత్రివర్యా! ఏమిప్రయత్నము.

ఉ॥ చేసితిఁ బెక్కుదానములు ♦ చేసితి నెన్నియొ సద్వ్రతంబులన్
వాసిగ నెల్ల భూమిసుర ♦ వర్యులకుం ఘనభూములిచ్చితిన్
గాసిలుచుంటిగాని భువిఁ ♦ గానఁగనైతి ఫలంబు నక్కటా
వీసరవోయె నేమనుదు ♦ వెన్నుఁడు నన్ గరుణింపఁడాయెగా.

సమస్తసౌభాగ్యసంపదలును గలిగియుండియుఁ, దనయులను ముద్దాడు భాగ్యంబును నేను నోఁచనైతినిగదా. నాబ్రతుకు కడవిని గాచినవెన్నెలచందం బయ్యెనుగదా. అయినను వసిష్ఠునితో నాలోచింతము. (సేవకునిజూచి) సేవకా! నీవేగి వసిష్ఠమునీంద్రుని దోడ్కొనిరమ్ము.

సేవ — (నిష్క్రమించి వెంటనే వసిష్ఠునితోఁ బ్రవేశించును)

దశ — (వసిష్ఠునిజూచి నమస్కరించి) దేవా! ఆయాసనం బధిష్ఠింపుఁడు.

వసి — (ఆసీనుండై) రాజేంద్రా! నన్నురావించిన కతమేమి?

దశ — మహాత్మా!

తే॥ గీ॥ సకలసౌభాగ్యసంపద ♦ చాలకలిగె
తక్కువేమియు లేదయ్యె ♦ ధరణియందు
గానిసంతానభాగ్యంబు ♦ గలుగదయ్యె
నేమివచియించువాడమీ ♦ కోమహాత్మ.

సకలమునిజనగరిష్ఠా! వసిష్ఠా!

తే॥ గీ॥ మిమ్ముబోటుల ప్రాపును ♦ నెమ్మిగలిగి
యుండియును నొక్కసుతునైన ♦ నొప్పమీరఁ
బడయకుంటిని నావ్రత ♦ ఫలముగాదె
యేమిసేయుమందువో తెల్పవే మహాత్మ.

పూర్వంబునుండియు వచ్చుచున్న యీవంశంబు నిల్పుట కొక్కమొలకయైనను లేనందుకుఁ జింతింపుచుంటి.

వసి — రాజేంద్రా! నేనొక్కటి చెప్పెదను వినుము. అశ్వమేధయాగం బాచరింపుము. దానంజేసి నీకు దప్పక సుతులుజనింపఁగలరు. ఇందుకు నీవు సందియంబందక డెందంబునఁ జింతమానుము.

దశ — మహాత్మా! తమనోటినుండి యీనుడి వెలువడగానె నాకు సంతానోదయం బైనట్లే సంతసము జనించినది. తమయానతి శిరసావహించి యశ్వమేధం బాచరించుటకు సంసిద్ధుండనైయున్నవాఁడ.

వసి — తనయులం గాంచవలెనని నీకుఁ గోరిక జనించెను. నీవు తప్పక జగద్విఖ్యాతులగు తనయులం గాంచెదవు. శీఘ్రంబుగ యాగంబు సేయఁ బ్రయత్నింపుము.

దశ — మునివర్యా! తమయాజ్ఞ మౌళిపై ధరించి యందులకుఁ దగినవన్నియు సిద్ధము చేయించెద. (మంత్రినిజూచి) మంత్రివర్యా! సుమంతా!

సీ॥ గుఱ్ఱంబువిడుమీ ♦ గురుని యానతిబూని
తద్దయుముదమున ♦ దాని వెంటఁ
బంపించుమీ మన ♦ పౌరోహితు నొకండు
వరధీరుఁడౌవీర ♦ వర్యు నొకని
గట్టించుమింక యా♦గమునకు శాలలు
దివ్యముగ సరయూ ♦ తీరమందు
జాగ్రత్త జేయింపు ♦ సర్వవస్తు సమితి
నక్షయంబుగ నెప్పు ♦ డలరునట్లు
తే॥ గీ॥ యాగము సమాప్తి జేయించు ♦ నట్టిభార
మంత యీమునీంద్రునిపైన ♦ నలరఁ జేతు
చెప్పినవి యన్నియును నీవు ♦ చేయుమయ్య
తెలియకుండిన నీతనిఁ ♦ దెలుపుమనుము.

క్రతువిఘ్నం బాచరించుటకు రాక్షసు లనేకులు వీక్షించుచుందురు. అట్టివిఘ్నంబు లేమియుఁ గలుగకుండఁ దగుజాగరూకులై చతురంగబలయుతంబుగనుండి యజ్ఞరక్షణం బాచరింపవలసినదిగా మంత్రిబృందంబుతోఁ జెప్పుము,

సుమం — దేవా! వసిష్ఠమహామునీంద్రుని సన్నిధినే యొక్క సంగతి తమతో మనవి చేయఁదలంచితిని. రోమపాదభూమీశ్వరపరిపాలితం బగు నంగదేశంబున వృష్టిహీనతచే క్ష్మాతలంబు పరితపించుచుండ, నభూపవల్లభుండు పాఱులంబిల్చి, దానికిఁ గారణం బేమని యడుగ వారా తనిని విలోకించి "విభాండకముని పుత్రుండైన ఋశ్యశృంగుని దోడితెచ్చి నీపుత్రికయైన శాంతనిచ్చి పరిణయంబు సేయుము. అట్లయినచో దేశంబునకుఁ గలిగినకీడు నశించునని పలికిరి, అంతటనా

తండు ఋశ్యశృంగుని దోడితెచ్చి తనపుత్త్రికయగు శాంతనిచ్చి పరిణయం బాచరించెను. ఆమునికుమారుండు రోమపాదునిపురంబునఁ బాదంబు పెట్టగనే కుంభవృష్టిగ వర్షంబుగురిసె. కావున నావిన్నపమాలకించి, యాఋశ్యశృంగుని శాంతాసమేతంబుగా, దోడితెచ్చి క్రతు వారంభింపుము. ఇదినీకు శ్రేయస్కరంబు.

వసి—రాజా! సుమంతుండు వక్కాణించినది నిక్కంబు. ఆఋశ్యశృంగుని శాంతాసమేతంబుగాఁ దోడితెమ్ము. నీవడిగినచో రోమపాదుఁడు తప్పక పంపును. ఇందుకు సందియంబందకుము.

దశ—సుమంతా!

తే॥ సీ॥ బ్రహ్మచర్యంబునందుండి ♦ పరమనిష్ఠ
బూని తపము సేయుచునున్న ♦ మునికుమారు
నెట్టుపాయమునఁ దోడ్తెచ్చి ♦ యిచ్చినాడు
శాంత నాతనికి నృపతి ♦ సరగఁజెపుము.

సుమం—దేవా! ఈఋశ్యశృంగుఁడు తనతండ్రియగు విభాండకునిసేవింపుచు బ్రహ్మచర్యవ్రతమూని, మహానిష్ఠా గరిష్ఠాత్ముఁడై తపముజేసికొనుచుండెను. ఆతండు జన్మమందినతరువాత తపోదృష్టియేకాని, కాంతామణుల నెన్నఁడును జూచియెఱుంగడు. రోమపాదుఁ డాతనిని దోడితెచ్చుటకు మంత్రిపురోహితులను బోయిరమ్మనిచెప్ప వారాతనిని సమీపింపలేమనిచెప్పి, యాతని తపోభంగముచేసి తోడితెచ్చుటకు వారకాంతలే తగువారని నుడివిరి. అప్పుడు రోమపాదుఁడు వారాంగనలను నాతనిందోడితెచ్చుటకుఁ బంప, వారేగి యత్తపోవనమున విహరింపుచుండ, నెన్నఁడును స్త్రీలనుజూచియుండని యాతండు, వీరలంజూచి, వారికడకరుదెంచి, వారలను దనయాశ్రమంబునకుఁ దోడ్కొనిపోయి, యర్ఘ్యపాద్యంబులును, సత్ఫలంబులును నొసంగి పూజలందన్పెను. వారును నచ్చట పెక్కుదినంబులుండి, తమమాయావిద్యాకౌశలంబున నతనిని వశునిగాఁజేసికొని, యొక్కదినంబున యాతనింగాంచి "తపస్వివరా" మేము మాపురంబునకుఁ బోయెదము నీవచ్చుటకేతెంచెదవేని, సుఖంబుగూర్చెదమని చెప్పిన, నతండు మారువలుకక తండ్రినివిడనాడి, యక్కాంతలవెంటవచ్చె. అప్పుడు రోమపాదుం డాతనిని మంత్రిపురోహితులతో నెదుర్కొని తనకూఁతురగు శాంత నొసంగి, వివాహంబుగావించె. ఇప్పు డాఋశ్యశృంగుండు మాయింటనేయున్నవాఁడు.

దశ—వసిష్ఠమునీంద్రా! నేనారోమపాదుని కడకేగి,

ఉ॥ సంతతి లేనివాడ వెలుఁ ♦ జన్ గ్రతువొక్కటి సేయుచుంటి నీ
శాంతమనోవిభుం గృపను ♦ శాంతసమేతముగాఁ బంపుమీ
సంతసమేర్పడంగ నృప ♦ సత్తమ యంచును వేఁడికొన్నచో
స్వాంతమునందు సంతసిలి ♦ పంపకయుండునె రోమపాదుఁడున్.

వసి—అందుకు సందియంబందవలదు. ధరాపాలురనందఱను యాగముజూచిపోవుటకుఁ బిలువఁ గొందఱమంత్రులంబంపి, నీవుమాత్రము, మిధిలాపురాధీశ్వరుండగు జనకుని, కేకయభూపాలుని, రోమపాదుని స్వయముగాఁ బిలువుము.

దశ—చిత్తము. ఇంక మనమేగి ఋశ్యశృంగుని దోడితెచ్చుటకుఁ దగిన ప్రయాణ సన్నాహం బాచరించుకొనవలయును. రండు.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

---

[రంగము—రామశాస్త్రి ప్రవేశము.]

రామ—(తిరుగుచు) వర్ధిల్లుఁగాక. వర్ధిల్లుఁగాక. దశరథుండాచంద్రతారావనీశరధి స్థాయిని వర్ధిల్లుఁగాక! దశరథుండు పుత్రవంతుఁడై యొగడుఁగాక.

కృష్ణశాస్త్రి—(ప్రవేశించి) అయ్యా! తమదేగ్రామము?

రామ—మాదేగ్రామమైననేమి? నీవిప్పుడేదియో గ్రామమునుండివచ్చుచున్నట్లున్నావు. సత్వరమ్ముగ యజ్ఞశాలకుఁబోయి భోజనం బాచరించి సంభావనగైకొమ్ము.

కృష్ణ—ఏమియజ్ఞము?

రామ—నీకుఁదెలియనేలేదా! దశరథుండు పుత్రసంతానమునకై యశ్వమేధయాగంబు సేయుచున్నాఁడు. అందునిమిత్త మనేకరాజులు వచ్చియున్నారు. శాంతయు ఋశ్యశృంగుఁడును నరుదెంచినారు. మనము చూచితీరవలయును. దశరథుని జూచి యాశీర్వదించిన భూసురులకెల్లఁ గొల్లలుగ ధనము లభించుచున్నది.

కృష్ణ—కవీశ్వరులకేమైన బహుమతులిచ్చుచున్నారా?

రామ—కొల్లలుగా; తమకుఁ గవిత్వమందు ప్రావీణ్యమున్నదాయేమి?

కృష్ణ—కొద్దిగానున్నది. నేనును రాజుగారిదర్శించెద.

రామ—అయ్యా! నన్నుగూడ మీవెంటగొనిపొండు. ఏవో రెండుపద్యములు వ్రాసి యిస్తే నల్లనవేసి చదువుతాను. అమాయకుఁడా రాజు నాకేదైన నొసంగకపోడు

కృష్ణ—ముందునాకాకలి యగుచున్నది. భోజనానంతర మాలోచించుకొందము రమ్ము.

(నిష్క్రమింతురు)

---



# శ్రీరామజననము.

## తృతీయాంకము.

[దేవలోకము—సుధర్మాసీనుఁడై దేవేంద్రుఁడును, బృహస్పతియు, జయంతుఁడును బ్రవేశించుచున్నారు]

ఇంద్రు—ఆచార్యవర్యా! దేవతానాథుండనై యుంటినను సంతసంబేకాని, నాపదవియును బ్రతుకును వేయేండ్లాయువు దినదినగండ మనునట్లున్నది.

ఉ॥ ఎందఱినో సురారులను ♦ నే పడగించితి దర్పమేర్చి యిం
కెందఱినో వధించెను ర ♦ మేశుఁడు సత్కృపఁ బూని భూమి నిం
పొందఁగఁ బెక్కువేషముల, ♦ బోయెను భీతియటంచు నుండఁగా
పందగశాస్యుఁడిట్లు మన ♦ పై కరుదెంచెను నేమిసేయుదున్

ఆహా! ఆభారతీశున కేమియుఁ బనిలేదుకదా. ఇట్టి ముక్కడి రక్కసులఁ బుట్టింప నేల? అబ్బబ్బా! వీరియెదుటఁ బాఱఁజాలకుంటి నిక్కదా.

బృహ—బ్రహ్మ వీరిని బుట్టించినఁ బుట్టింపవచ్చును గాని దుర్భేద్యములగు వరములీయ నేల?

ఇంద్రు—అన్నన్నా! ఆవరంబులు దలంచినంతమాత్రముననే నాగుండెలు తల్లడిల్లుచున్నవి. సురసిద్ధసాధ్యయక్షకిన్నరకింపురుషగరుడోరగాదులచే మరణంబులేకుండ బ్రహ్మ యాతనికి వరంబు లిచ్చెనఁట. ఇట్టివరంబు లిచ్చునప్పుడా ధాత యింతకైనను వెనుకముందు లరయ నవసరములేదా?

బృహ—వెనుకముందులు చూచినచో నిక్కేల యుండును. త్రిమూర్తులు తపంబునకు సంతృప్తినొందువారుకదా! అందు భాషానాథుఁడు తన్నుఁగూర్చి తపంబాచరించినచో మరింత పొంగి మరికొన్ని వరంబు లిచ్చును. ఈదానవుండు బ్రహ్మంగూర్చి తపంబొనరించి యాతనిని మెప్పించి యట్టివరంబులు వడసినాఁడు.

ఇందు—గురువర్యా! ఈదశకంఠుఁ డెంతటితపం బాచరించెనా?

బృహ—వాఁ డాచరించిన తపంబు నేమునీందు్రఁడును జేసి యుండలేదు. పదివేల వత్సరంబులు పంచాగ్నుల మధ్యంబున నిలచి ఘోరతపం బాచరింపుచు నర్ధస హస్రంబు పూర్తియగుచుండు నప్పటికి నొకతల యజునిఁ గూర్చి యగ్నికాహుతి నేయుచుండెను. ఇట్లు తొమ్మిదివేల వత్సరంబులకును తొమ్మిదిశిరంబులు ను నగ్నికాహుతిజేసి పదియవవత్సరంబునఁ బదియవశిరంబును నగ్నింబడవేయనుం డ నవ్విరించి ప్రత్యక్షమై "నీవుచేసినఘోరతపంబున కానందించితి వలసిన వరంబులు గోరుకొ" మ్మని యానతీయ నాదైత్యుం డాతనిని విలోకించి, జీవికి శత్రువు మరణంబుగావున నాకమరత్వమిమ్మని వేఁడెను. అందులకుఁ బితామహుం డు సమ్మతింపక నదితప్ప వేరొండు వరంబు గోరుకొమ్మని చెప్పెను.

ఇందు—విధాత మనకిప్పటి కించుక యుపకారమే చేసెను. లేకున్నచో మనల నాదైత్యుండు బ్రతుక నీయకయే యుండును, తరువాత,

బృహ—అప్పు డాతండు సురసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషగరుడోరగాదులచే మరణంబు లేకుండ వరంబిమ్మని కోర, నతండిచ్చి, యగ్నికాహుతి జేయఁబడిన తొమ్మిది శిరంబులును మరలవచ్చునట్లు బ్రసాదించె.

ఇందు—ఆదుర్మార్గుని పేరు విన్న నే భయంబగుచున్నది. దేవా! ఇందతిచేతను మర ణంబు లేకుండ వరంబు లందిన యాదానవుండు నరులచే మరణంబు లేకుండ వరం బేలగ్రహింపలేదు. సురాదులు జయించుచున్న యాతనికి నరులెంతమా త్రమని తలంచియుండెను గాఁబోలు.

బృహ—అయియుండును గాని యది మనకుపకారమే.

ఇందు—ఎట్లు?

బృహ—ఎప్పుడో శ్రీమహావిష్ణువు మనలం గరుణించి నరరూపంబున నీతనిని వధింప కుండునా!

ఇందు—ఇప్పటికి నారాయణునకు మనయందు దయరాకపోయెనుగదా.

బృహ—ఏమట్లంటివి?

ఇందు—మొన్న నేను నారాయణ సన్నిధానంబునకు నేగి, రావణుఁడు దండెత్తి వచ్చుచున్నాడని తెలిపి,

చం॥ హరి పరమాత్మ యేలుమిఁక ♦ నార్తజనావన రావణుండు సం
గరము నొనర్చి సర్వసురు ♦ కాండము గెల్వఁగవచ్చుచుండె స

ద్వారములు గల్గియుండుటను, ♦ వాఁడిక నూరకపోడు కావునన్
దూరమున నాకు నీవిపుడు ♦ దోడ్పడు చక్రము బూనుచున్ గృపన్.

హ—అందుల కాజగద్రక్షకుండగు లక్ష్మీవల్లభుం డేమని ప్రత్యుత్తరం బిచ్చెను?
ఇంద్రు—ఏమనిచ్చెనా !

ఉ॥ తెలిసెను దేట తెల్లముగఁ ♦ దెల్పఁగనక్కఱలేదు భీతినిం
గొలుపుచునుండె లోకముల ♦ కున్ గడుఁగ్రూరతబూని యంచు నే
నరసితి దానవాధముని ♦ నాజిని వానిమదంబడంపఁగాఁ
దరి యిదిగాదు నాకు విను ♦ తథ్యముజెప్పితి దేవనాయకా.

అని చెప్పినాడు.

బృహ—సహాయపడనందుకుఁ గారణంబేమైనఁ జెప్పినాడా !
ఇంద్రు—ఇట్లుజెప్పినాఁడు.

తే॥ గీ॥ బవరమునుసేయగా నేను ♦ వచ్చియున్న
నరిచయంబును మనుమక ♦ మరల నెపుడు
వట్టినాప్రతిజ్ఞలుసాగ ♦ వయ్యెయిపుడు
దానవుండు వరములబడసి ♦ తనరుకతన.

నీమదియందు జింతమాని యాతనితో నెట్టెట్టో రణంబు చేయుము. ఆతనిని నేనే యెప్పుడో వధించెద.
బృహ—ఈమాట నేనిదివఱకే చెప్పియుంటిని. ఎప్పటికయినను నాదైత్యుండు నారాయణచక్రానలజ్వాలలయందు భస్మమై పోవలసినవాడే.
ఇంద్రు—ఎప్పుడోమాట నిప్పుడాలోచింపనేల ? ఇప్పుడీ దానవుని దాఁటుటయెట్లు ?

(తెరలో)

తే॥ గీ॥ పాఱిపోయెడి యమరులఁ ♦ బట్టిపీచ
మడఁపుడీ మదిలోన భ ♦ యంబులేక
దేవవేశ్యలదోడ్తెచ్చి ♦ దివ్యమైన
యాటలాడింపుఁడీ వేగ ♦ హర్షమెసఁగ.

ఇంద్రు—ఆచార్యా! ఎవ్వరిదీకంఠస్వరము.

బృహ—ఎవ్వరిదని యడుగనేల? క్రూరచిత్తులై పరాక్రమంబున విజృంభించిన దైత్యులవియే.

ఇంద్రు—అమరుల సైన్యంబంతయుఁ బలాయనంబైనది కాఁబోలు. యమవరుణకుబేరాదు లేమైరోకదా!

[తొందరగా జయంధరుఁడు ప్రవేశించుచున్నాడు]

ఇంద్రు—(జయంధరుని జూచి) జయంధరా! ఏమి? యింత తొందరగాఁ బరుగెత్తుకొని వచ్చితివి.

జయం—అమరులయొక్క యపజయంబును దెలుపుమని ధాత నానొసట వ్రాసినాడు.

ఇంద్రు—ఏమి! అమరులకే యపజయమా?

జయం—ఆరాతులతో బోరిపోరి, తుదకు మన సైన్యంబంతయుఁ బలాయనంబైపోయినది. యమవరుణకుబేరాదులే యోడిపోయిరి.

ఇంద్రు—అక్కటా యముడుగూడ నోడిపోయెనా.

జయం—దేవా! ఏమి చెప్పుదును యమరావణు లిరువురును గలహంబునకు దొడంగి ఘోరంబుగఁ బోరుచుండ నందు యముఁ డలిగి ప్రళయకాలరుద్రుని లీల మండిపడుచుఁ దన దండమును దైత్యునిపై విడువఁబోవఁ గడురయంబున బ్రహ్మ యచ్చోటికివచ్చి యాతని చేయిఁబట్టుకొని,

మ॥ యముఁడా! వీడకు నీదుదండమును దైత్యశ్రేష్ఠుపై నిప్డు దం
డమునం జచ్చు నతండు తప్పక నిశాటస్వామి చావుండు న
ట్లు మహీశ నేను వరంబులిచ్చితిని నెట్లో సైచి శాంతించు మిం
క మదీయోక్తిని సత్యమౌనటులుగా గావింపుమీ చంపకన్.

అని వచించె. అప్పుడు శమనుం డేమియు మారువలుకక రథంబుతోఁగూడ మాయమయ్యెను.

ఇంద్రు—హా అమరులారా!

చ॥ సురరిపు లేగుదెంచి మిము సొక్కగఁ జేయుచునుండ, నేను సం
గరమున కేగుదెంచి రిపు కాండముతోడ నెదిర్చి వారలన్

దటిమి ముదంబుమీాకిపుడు ♦ తద్దయుఁగూర్పగ లేకపోతిగా
వరబలమున్ బరాక్రమము ♦ భండన పాండితి గాల్పనా మహేన్.

తే॥ గీ॥ బలముగలిగియుండియును బల్ ♦ వజ్రబాణ
ముండియును వలసినసైన్య ♦ ముండి యసుర
వైరిదాకగాఁ వెఱచితి ♦ భారతీధ
వుండు వానికి వరమిచ్చి ♦ యుంచుకతన.

[తెరలో]

సీ॥ నరభోజనులమంచు ♦ నానావిధంబుల
దైత్యులదూషించు ♦ధైర్యశాలి
గౌతమముని కాంత ♦ గలియంగ నడిరేయి
కుక్కుటంబైనట్టి ♦ టక్కరీడు
సంగ్రామమందున ♦ శంబరాసురధీరు
గెల్చినయట్టి సత్కీర్తి పరుఁడు
వజ్రబాణము దాల్చి ♦ బాహుబలస్ఫూర్తి
జరియింపుచుండెడి ♦ శౌర్యమూర్తి

తే॥ గీ॥ అష్టదిక్పతులెల్లరు ♦ నతిముదమునఁ
దన్ను సేవింప నలరెడి ♦ మన్నె కాడు
అతఁడు మీామహారాజు స్వర్గాధినాథుఁ
డేడనున్నాడో తెల్పుడీ ♦ త్రిదశులార.

జయం—దేవా! తొందరపడుడు.

ఇంద్రు—జయంధరా! ఈకంఠస్వరం బెవ్వరిది ?

జయం—రావణాత్మజుండగు మేఘనాథుం డరుదెంచుచున్నాఁడు.

ఇంద్రు—వీడు గడుమాయాయుద్ధవిశారదుండని వినియుంటి. (బృహస్పతిం జూచి)
ఆచార్యా! కర్తవ్యమేమి ?

బృహ—రణాతిథ్యంబు నిచ్చుటయే కర్తవ్యము. వీడు మంచిమాటలచే జయు వాడుకాడు.

జయం—తండ్రీ! దీనికి మీరాలోచింప నేల?

శా॥ ఆలోచింపఁగ నేల వీనికిటు దైత్యాధీశుపుత్త్రుండు దా
నీలీలన్ జనుదేరనిమ్ము పుడు నేనెంతైన వెన్దీయకే
యాలంబందు నెదిర్చి వానిని సముద్యద్దర్ప మేపారగా
గ్రోలంజూచెద వానిప్రాణచయముల్ ఘోషింప నక్తంచరుల్॥

[అంత మేఘనాథుఁడు సీ॥ నర—అనుపద్యంబును జదువుచు ప్రవేశించుచున్నాఁడు]

మేఘ—ఇంద్రుఁడెక్కడ?

తే॥ గీ॥ మమ్ముగెల్వంగ మదియందు భయమునంది
యమర సేనను నాజికి నంపినట్టి
వీరచరితుండు బలుఁడు దేవేంద్రుఁడతఁడు
నతనిఁ జాడగోరెడి రావణాత్మజుండు.

(ఇంద్రునిజూచి) ఇదిగో! ఇంద్రుఁడు. ఆహా! యేమి నాభాగ్యము.

తే॥ గీ॥ వెదుకబోయినతీగయే పదములకును
దగులు భంగిని నిప్పుడీ దైత్యరిపుని
గాంచగల్గితి గన్నుల కఱవుదీర
చూడవలెనీతని బలము సొంపునింక.

(ప్రకాశముగా) దేవేశ్వరా!

మ॥ వరసంగ్రామము సేయగా నమరులన్ బంపించి నీవిట్లు మం
దిరమందున్ ముదమందుచుంటివె రణా తిథ్యంబునుంగోరి నే
నరుదేరన్ ననుగాంచకుండుటిది భావ్యంబౌనె నీకిట్టులన్
సరగన్ రమ్ము త్వదీయ శౌర్యగరిమన్ నాకింత చూపింపుమీ.

(ప్రకాశముగా)

బృహ—(మేఘనాధుని జూచి) దానవనాధాత్మజా ! రణాతిథ్యంబును గోరి యేతెంచిన నేతెంతువుగాక. ఆపీఠంబున నలంకరించి, యొక్కింత రణాయాసంబు దీర్చికొనిన పిదప నీయిచ్చవచ్చిన ట్లాచరింపుము. కావున నాపీఠంబున నాసీనుండవగుము.

మేఘ—(బృహస్పతిని జూచి) అమరాచార్యా ! ఇట్లు చెప్పుమని యయ్యింద్రుడు నీతోఁ జెప్పెనా యేమి ? అవునవును. చెప్పియే యుండును. ఈ యమరనాధుని సంగతి యెవ్వరెఱుంగరు.

తే॥ గీ॥ అందెనేనియు జుట్టులే ♦ కందకున్న
పాదములటంచుఁ జెప్పెడి ♦ వాక్య మితని
యందు సార్థకంబయ్యెను ♦ నరసియుంటె
నింకనీవును వచియింప ♦నేలయిట్లు?

చాలుఁజాలు. మీసంగతిఁ గనుఁగొంటి. ఏవియో నాలుగుమాటలు చెప్పి నన్నుఁ బంపివేయఁ జూచుచుంటిరిగాని, యట్లెన్నఁటికి జరగదు. ఓయీ ! యింద్రా !

ఉ॥ మాటలతోడనేఁ జనను ♦ భండన భూమిని నీదుశౌర్యముఙ్
బోటుతనంబు జూడఁ బరి ♦ పూర్ణమనోరథ మేర్పడంగ నే
నీటుగ వచ్చినాడ నిటు ♦ నీవిఁక భండన మిమ్ము మూరుము
మ్మాటికిఁ జెప్పినాడ నిఁక ♦ మానసమందున శంకయేటికిఙ్.

శా॥ నీరంధ్రంబుగ బాణవర్షము సురా ♦ నీకంబుపైఁ గప్పివే
బారం దోలితి నాలమందల గతిఙ్ ♦ భావంబులో సంతసం
బారీతిన్ గలుగంగలేదు విను ము♦ద్యద్దర్పమేపార, నీ
తీరుంజూచిన యప్డు మానసము తృ♦ప్తింజెందు దేవేశ్వరా.

తే॥ గీ॥ వజ్రబాణముధరియించి ♦ వరలుదువఁట
యెంతయో బలశాలివై ♦ యెగడుదువఁట

నసురులను దునుమాడఁగా ♦ సరయుదువఁట
వచ్చినాఁడను భవదీయ ♦ బలముచూడ.

బృహ—ఓయీ! మేఘనాథా! ఏల యీరీతి బల్కెదవు? తానే బలవంతుండనని చెప్పుచుఁ గంకణంబు ధరించి యీయింద్రుఁ డేమయినఁ జరింపుమన్నవాఁడా? అట్టిచో వృథాగాఁ గయ్యంబునకుఁగాలు ద్రవ్వనేల? దీనివలన మీరువడయులాభమే మైననున్నదా? మీకు శౌర్యంబు గలదేని వైరులమీఁదఁ జూపనగునుగాని యకారణంబుగ నమరలోకంబుపైకి దండెత్తివచ్చుటయేమిన్యాయము? ఇదిమీకు సమంజనముగనే కన్పడునుగాని, మాబోంట్లకుమాత్రము సమ్మతిగనుండదు. కావున నిదివఱకే మాయమరులనందఱిని గాసిచేసి, పలాయనమగునట్లుజేసిన నీవింక నింతటనూరకుండి మీలంక కేగుటమంచిది. రణంబాచరించినచో నుభయబలంబులును నాశనంబగుట తప్ప మరేమియుఁ బ్రయోజనములేదు. అదియుంగాక నీవిప్పుడింద్రునితోఁ గయ్యంబాచరించితివేని యిరువురిలో నెవ్వరుగెల్తురో యెవ్వరికిఁ దెలియును? జయాపజయంబులు దైవాధీనముకదా. అమరులకు మృత్యువులేదను సంగతి నీకుఁ దెలియును. ఆకారణంబున శచీధవుండు రణంబున నీచేమడియువాఁడుకాఁడు. ఒకవేళ నీవు మడిసితివేని మహాబలపరాక్రమముచే విరాజిల్లుచున్న నీకై నీతండ్రి యెంతయో పరితపించవలసివచ్చును.

మేఘ—(నవ్వుచు) మేము భూసురులవలెఁ బిఱికివారమనియా యిట్లాడుచుంటివి. ఈ యింద్రునకుఁగాని, నీకుఁగాని మరియెవ్వరికినిగాని భయపడువాఁడనుగాను. నేనొకవేళ రణంబున మడియుదునేమోయని భీతిగొల్పుచుంటివా? ఇట్టిమాట పలికినందులకు నమరగురుండవని తలఁచి సైరించితి.

క॥ వారణసన్నిభుఁడను నని
వారణవిక్రముఁడ దైత్య♦వర్యుని సుతుఁడన్
వీరుఁడ నాబాణంబులఁ
బారింబడి బ్రతుకలేరు ♦ బలులెవ్వారున్.

ఇంద్ర—(బృహస్పతినిజూచి) గురువర్యా! మీరింక నీతనితో సంభాషింపరాదు. పరధనపరాంగనాపహరణధురీణుండగు నీతుచ్ఛునకు నాబాణచవిజూపించినంగాని వీలుపడదు.

మేఘ — ఓహో! నన్ను బరధన పరకాంతాపహారకుఁడని యాక్షేపించుచుంటివా!
ఓరీ! మూర్ఖా! ఇటువినుము. 7/33

ఉ॥ నీవలె నేను గౌతమము♦నీంద్రుని యింటను గోడినై తినో
నీవలె నేను త్వష్టసుతు♦నిన్ ఘనద్రోహముబూని చంపితో
దేవవిరోధులెంతయును ♦ దివ్యతపంబును సేయనోర్వనో
భావమునం దలంప కిటు ♦ బల్కఁగఁబాడియె దుర్మదాధమా.

ఇంద్రు — (తనలో) బాణంబులకన్న నీతుచ్ఛనిపలుకులు నాహృదయంబునకు మిగుల సంతాపముగలుగఁజేయుచున్నవి.

జయం — (మేఘనాధునిజూచి) ఓరోరీ! దైత్యవంశబడబానలా!

ఉ॥ బీరముశౌర్యమున్ గలిగి ♦ వీరుఁడవంచుఁ బ్రసిద్ధిగాంచి యీ
తీరున దేవతాపతిని ♦ దెంపరివై యిటు బల్కనేల యిం
పారఁగ నీపరాక్రమము ♦ నాజినిజూపఁగ రాదె యిప్పుడే
ఘోరరణంబునందు నిను ♦ గూల్తును నీ జనకుండు కుందగన్.

మేఘ — తే॥ గీ॥ అదరిపడుచుంటి వేలరా ♦ యాజియందు
నీవునను గెల్చువాఁడవా ♦ యింకఁ గట్టి
పెట్టు మీమాట నీ బోటి ♦ వీగుతోడ
సంగరముసల్పు మొక్కింత ♦ శౌర్యమున్న.

జయం — ఓరీ! వాచాటా! వృధావచనంబులతోనేమిపనియున్నది. అస్మద్బాణంబులు నీప్రాణంబులుగోరిల కడుతొందరపడుచున్నవి.

మేఘ — అట్లనా. అయిననీ బాణముగాచికొమ్ము.

జయం — ఈశరంబు నీప్రాణంబులుదీయును.

[ఇరువురును యుద్ధముసేయుదురు జయంతుఁడు పాఱిపోవుచున్నాఁడు]

ఇంద్రు — (రౌద్రావేశుఁడై)

శా॥ ఓరీ! నిల్వుమొకింత నేపిచట జ♦న్యోద్యోగమున్బూని, నీ
ధీరత్వమ్మును శౌర్యముల్ బలము న♦ర్థిం జూపుమీ వేగమే

నారాచంబులగప్పి నిన్నిదె వెసన్ ♦ సంగ్రామరంగంబులో
గ్రూరుల్ దానవులెల్ల గుందగమదిన్ ♦ గూల్తున్ నిమేషంబులో.

మేఘ—ఓరీ! ఇంద్రా! నీవుబంపించిన యష్టదిక్పతులగతి యేమైనదో నీకే తెలియును కదా. నన్ను నీవు గూల్చువాడవును నేనునీ చేఁగూల్పఁబడువాడనునా! చెప్పవచ్చునుగాని చేయుట సుకరము గాదు. నాతోఁ గయ్యమనఁగా నేమిగాఁదలంచితివో.

సీ॥ నందనంబిదిగాదు ♦ నరభోజనులతోడ
నిండినకయ్యంపు ♦ నేలగాని
రంభ చల్లెడిపువ్వు ♦ రాగంబులివికావు
వేఁకిచూపెడిబాణ ♦ వితతిగాని
ఆరూఢ మధురవీ ♦ ణారవములుగావు
ప్రతిభటాభీలహుం ♦ కృతులుగాని
తద్దయువంచింప ♦ ద్వష్టసుతుఁడుగాడు
శూరుఁడౌ రావణ ♦ సుతుఁడుగాని
తే॥ గీ॥ తలఁప సుఖకేళి గాదు యు♦ద్ధంబుగాని
మురియుటలుగావు ఘనమృత్యు ♦ ముఖముగాని
చాలు నీవేడ నన్నిప్డు ♦ చంపుటెడ
నవ్వుదురు దీని విన్నను ♦ నెవ్వరైన.

ఇంద్రు—ఓరీ! నీప్రగల్భంబు లెక్కఁడసాగిరావు.

మ॥ సమరంబందున నిప్డు నీదుజనకున్ ♦ జంపందలంపూనుచున్
శమనుండున్ దనదండమూనివిడువం ♦ గానుండగా ధాతవే
గమెయేతెంచి కృపాకటాక్షమునదాఁ ♦ గాపాడెఁ గాకున్నచో
యమునిం జేరరె నీదుతండ్రియును దై♦త్యశ్రేణి యీపాటికిన్.

కానిమ్ము. నేను నీతు క్రీడంచెదను రమ్ము.

మేఘ—ఇదిగో రణంబునకు సంసిద్ధుఁడనైయుంటి.

(ఇరువురును గయ్యంబాచరింపుచున్నారు మేఘనాథుఁడింద్రుని బంధించును)

మేఘు—ఓయింద్రా! నీవుపలికిన వీరపుబలుకులేమైనవి. ఈశౌర్యంబుతోడనేనా దైత్యుల నెదిరింపఁదలంచితివి.

బృహ—(తనలో) ఆహా! దేవనాథుం డొకదైత్యునిచే జిక్కుపలసినవాఁడా! కాలగతి కెవ్వరుకర్తలు?

ఇంద్ర—(తనలో) ఆహా! ఈదుర్మార్గుఁడు నన్నుమాయచేసి బంధించినాడే. ఇంక వీఁడు నన్నేమిచేయునోకదా! ఏమిచేసినను ననుభవింపకతప్పదు.

[తెరలో]

నందనా! మేఘనాధా! భవదీయబాహుబలశౌర్యపరాక్రమంబుల కెంతయో సంతసించితిని. దేవతాతతింబారదోలి మహాకీర్తిఁగడించినాడవు. ఇట్టిమహాత్కార్యంబు నాచరించి మనదైత్యాన్వయంబునకెల్ల యశంబుదెచ్చితివి. ఇంకనుత్రామునిరథముపైబెట్టుకొని సమస్తసేనతోడను మరలుము. నేనును నీవెనువెంటవచ్చెద.

మేఘు—తండ్రిగారియాజ్ఞ నెరవేర్చుచున్నాడ.

(ఎలుఁగెత్తి నలుదిక్కులుబరికించి)

మ॥ బలశౌర్యోన్నతుఁడౌ శచీధవుని మద్బాహా బలాటోపతన్
గలనన్ బంధనజేసి నేనిదిగొ లంకంజేర్చు చున్నాడ, నా
కులపాటొందుచు నున్న యీతనిని వేఁ గొంపోవగాఁజాలు దో
ర్బలులున్నన్ వెనువెంటవచ్చి విడిపింపం జూచుకొండీయిఁకన్.

ఇంద్రు—(స్వగతము) ఈదుర్మార్గుఁడు నన్నిప్పుడు లంకకుఁ గొంపోవుచున్నాడే. అయ్యో! నన్నిప్పుడువిడిపించువారెవరు? అమరులందఱును బలాయనులైరి. జయంతకుమారుండెచ్చోటదాఁగియున్నాడోకదా. చింతామణీకామధేను కల్పవృక్షేత్యాది భాగ్యఁబుల బాసిపోవుచుంటిని. నందనోద్యానంబున విహరించునేనింక గారాగారంబున వాసంబెట్టుసేయుదునోకదా. హా! ప్రాణేశ్వరీ! శచీరమణీ! నీవు నాకై యెంతకుందెదవోకదా!

[మేఘనాధుఁడింద్రుని గొంపోవుచుండగా తొందరగా బ్రహ్మ ప్రవేశించుచున్నాఁడు]

బ్రహ్మ—(మేఘనాధునిజేయిబట్టుకొని) వత్సా! రావణీ!

తే॥ గీ॥ మూఁడులోకంబులేలు సం♦పూర్ణబలుఁడు
పాకశాసనుబంధించి ♦ వరలినావు
చాలదేయిది భవదీయ ♦ శౌర్యమునకు
నింద్రజిత్తనుపేరిట ♦ నెగడుమింక.

నీవీతనినిప్పుడు లంకకుఁగొనిపోవుట భావ్యముకాదు. ఇతనిని విడిచిపెట్టుము. నీకమరత్వంబును త్రిలోకాధిపత్యంబునుదప్ప మరియొండువరంబులుగోరుకొ మ్మిచ్చెదను.

మేఘ—పితామహా! భవదీయాజ్ఞను మౌళింధరించి యీయింద్రునివిడిచెదను. నాయందుగరుణాంతరంగుండవై నేను రక్తచేలంబుధరించి, రౌద్రాగ్నికుండంబులఁగలిగిన, యగ్నివర్ణంబగు రథంబెక్కి రణంబుసేయునెడనమర్త్యతనిమ్ము.

బ్రహ్మ—అట్లేయగుఁగాక.

మేఘ—(ఇంద్రునివిడిచి నిష్క్రమించును)

ఇంద్రు—(బ్రహ్మనువిలోకించి) మహాత్మా! భారతీమనోహరా! సురాసురసమరంబులయందెన్నఁడును రిపులచే బరాభవింపఁబడని నేనిట్లు మేఘనాధునిచే బంధింపఁబడుట కేమికారణము?

బ్రహ్మ—ఇంద్రా! నవ్వుచుజేసినపాపం బనుభవింపకతీరునా! ప్రపంచంబుననున్న నారీమణులందఱికన్న మేటియనదగునట్లు నేనొక్క కుటిలాలకను సృష్టించి దానికి నహల్యయనునామం బిడితిని. ఆకన్నియనెవ్వరికిత్తునని నేనాలోచించుచుండ, నీవు మనంబునదానినిగోరి, త్రిలోకాధిపతినగు నాకుగాక యిక్కన్య యెవ్వరికిఁదగునని తలంచియుంటివి. తరువాత నేనక్కాంతను నిల్లడగాఁ గొన్నిదినంబులుంచుకొనుమని, గౌతమునికడకంపితిని. ఆతండామెను నతిజాగరూకతతోఁగాపాడి, క్రమ్మర కొన్నివత్సరంబులకు నాకడకుఁ బంపెను. నేనాతనిబుద్ధికిని దపోబలంబునకును మెచ్చి యామె నాతనికేయిచ్చి వివాహంబాచరించితి. అనంతరము నీవు వంచనబుద్ధిచేత నక్కాంతను గూడ నయ్యది గౌతముండెఱింగి నీకిడినశాపంబులలో నిట్టిశత్రువులచే బంధింపఁబడుదువని కూడనిచ్చెను. ఆకారణంబున నేఁడిట్లు బంధింపఁబడి నాచే ముక్తుండవైతివి. ఇంక విచారింపక భయంబుదక్కి గృహంబునకుఁబొమ్ము.

ఇంద్రు—మహాత్మా! నీకనేకనమస్కారములు.

(ఇరువురు నిష్క్రమింతురు)

[రంగము—రావణుడు—ప్రవేశము]

రావ—(స్వగతము) సకలలోకంబులును గెల్చితినిగాని మన్మధుని జయింప నావశమైనది కాదుకదా !

తే॥ గీ॥ సంగరంబున శాత్రవ • సమితివీడు
బాణములకన్న వేఁడియై • పరఁగుచుండు
నంగజుఁడువీఁడు పుష్ప శ•స్త్రాస్త్రచయము
వీనిగెల్వంగ శక్య మె•వ్వానికగును.

ఔరా ! మన్మధా ! నారాజ్యలక్ష్మియగు మందోదరి నాసన్నిధినిలేదుకదాయని తలంచియా యిట్లువేపఁజొచ్చితివి. (ఆకాశమునంకఁజూచి) మింటజంద్రుఁ డెట్లువిరాజిల్లుచున్నాడు ? కాముని కీతండు మేనమామయగుటంజేసి, విరహాంబోధినిమగ్నమానసులవేఁపుటకాతనికి దండుమరింతసహాయంబు సేయును.

[అంతవజ్రకంఠుఁడు—ప్రవేశించుచున్నాడు]

వజ్ర—(రావణునిజూచి తనలో) ఓహో ! దానవేంద్రునకు మారవికారంబంకురించినదే. ఇంక నన్నుతఁడే దేవవేశ్యనో పిలుకొనిరమ్మనిచంపును. ఈయన కామవికారంబు నాకొంపతీయుటకేవచ్చినది.

(ప్రకాశముగా) దానవేంద్రా !

రావ—వజ్రకంఠుఁడేనా !

వజ్ర—దైత్యేశ్వరా ! నేనువజ్రకంఠుఁడనే పిండారబోసినట్లు వెన్నెలకాయుచుండ నన్నానవాలుబట్టలేకపోయితిరికదా.

రావ—ఇస్సీ ! ఆనవాలుపట్టకేమి? అబ్బా ఈవెన్నెల యెంతప్రాణముతీయుచున్నది.

వజ్ర—దేవా ! అట్లుపలుంకుతురేమి ? వెన్నెల కన్నతల్లికదా.

రావ—కాముకులపాలిఁటి యమదూత.

వజ్ర—దేవరవారు కాలమునకు లోఁబడినట్లేయున్నది.

రావ—లోఁబడక చేయునదేమియున్నది ?

వజ్ర—వానిపీచమడంపలేరా !

రావ—అచ్చరమచ్చకంటి యొకతె లభించినప్పుడుకదా.

వజ్ర—మీరు దేవలోకముపై దండువిడిసినారనివిని దేవవేశ్యలందఱును బారిపోయిరి.

రా—అసురులనుబట్టి పాల్గార్చినట్లు వారినిగూడ నేమైన చేయుదుమని తలంచిరికాఁబోలు

వజ్రి—(ప్రక్కలంజూచి) దేవా! సద్దుచేయకుఁడు అటుజూడుడు. ఆహా! తాటిమ జలవలె కనులుద్రిప్పుచు, నీటుగానడచుచు పాటబాడుచు, నీచాటు నెవ్వ యోవచ్చుచున్నది.

రావ—ఈవాల్గంటి యెవ్వతోకదా!

[రంభ ప్రవేశించుచున్నది.]

రంభ—(రావణునిజూచి తనలో) అన్నా! మోసమువచ్చెనే. ఈతండు కడుకూరరక్ త్ఘుఁడు. వీనియెదురుటనుండిగాని పోవకతప్పదు. ఏమిహానిసేయునో (నడచుచున్నది

రావ—(రంభంజూచి)

ఉ॥ ఎవ్వరిదానవీవు జల ♦ జేక్షణ నీయభిధానమేది, నీ
వెవ్వని దృష్టిజేయగను ♦ నెచ్చటి కేగుచునుంటివిప్పుడుఌ
గొ్రవ్వరిబంతిరో యిఁకను ♦ గోర్కలరారగ నన్నుగూడి, నీ
వవ్వల నేగుమీ యిఁకను ♦ నందక సందియమెంతయుఌ మదిఌ.

రంభ—(తలవంచినిలువఁబడును)

వజ్రి—ఏమి! మారుపలుకవు? దైత్యేశ్వరుండగు దశకంఠుఁడు నిన్ను గోరుచుండగా బలుకకుండుట కెన్నిగుండెలున్నవి?

రావ—రామామణీ! భయమునొందెదవేల?

రంభ—దానవేశ్వరా! నన్నురంభయందురు.

వజ్రి—దేవా! దేవవేశ్యలలోకెల్ల సౌందర్యంబునఁ బ్రసిద్ధికెక్కినదిరంభయే. దేవర రు నేఁడెంతయుఁ బుణ్యముచేసికొనిరి.

రావ—రమణీ! జగత్ప్రఖ్యాతసుందరవిగ్రహవగు నిన్నుఁగాంచుటంజేసి, నేనెంతయుం న్యుండననుమా!

రంభ—(తనలో) ఈదానవుని చిత్తంబు నన్నుఁజూచినయంత నే చలించియుండనో ప

రావ—తరుణీమణీ! సందేహించెదవేల?

శా॥ లంకాలక్ష్మికి భర్తనై జగము లెల్లఌ భీతిజెందన్ నిరా
తంకం బొప్పగరాజ్యమేలుదును దైత్య శ్రేణి సేవింపగాఁ

బంకేజాస్త్రుని బాణ జాలమునకున్ ♦ బాజెంది నీయండనో
పంకేజాక్షిరో చేరినాడనుగ్రపన్ ♦ భావించి రక్షింపుమీ.

వజ్ర—రంభా! ఇంకను నాలోచించెదవేమి? మంచిబహుమతిదొరకగలదు.

రంభ—(ఎఱ్ఱబారిచూచుచున్నది)

వజ్ర—నీచూపులకు భీతినొందువా రిచ్చట నెవ్వరునులేరు.

రంభ—దానవేశ్వరా! నీవు నాకు మామవగుదువు. నేను నీకుఁగోడలను. నన్నెవరైన బరాభవించినచో నీవు బ్రోవవలెను. అట్టిచో నీవే నన్ను బరాభవింతువా! పరుల విధంబున నీవే నన్ను నగుబాట్లొనరింప న్యాయమా!

రావ—తే॥ గీ॥ పరగఁ గోడలనంచును ♦ బల్కుఁదగునె
నాదునందనునకెపుడు ♦ నాతివౌచు
నింట వాసంబుజేసితో ♦ యిప్పుడీరా
వింతదోఁచెను నీమాట ♦ కాంతమిన్న.

రంభ—దానవనాధా! ఇందుసందియంబేమున్నది? నీవును గుబేరుడును నన్నదమ్ములు కదా! కుబేరుని పుత్రుండగు నలకూబరుఁడు నాకుభర్తయగును. ఆవరుసంబట్టి నేను నీకుఁ గోడలను. నీసుతుండగు నలకూబరుండు ధర్మగుణంబున బ్రహ్మణ్యుండు. భుజశక్తియందు క్షత్రియుఁడు. కోపంబుదాల్చెనేని యగ్నివంటివాఁడు. అతఁడుతప్ప నన్యపురుషులపై నాకువలపులేదు. కావున నామనవివిని నాకనుజ్ఞనిమ్ము.

రావ—అబలా! అమరపురంబునంగల వేశ్యలవావులును మర్యాదలును నేనెఱుంగనవి కావు.

వజ్ర—భోగమువాండ్లకు వావివరుసలుకూడనా! డబ్బుతోటేపని.

రంభ—దైత్యాన్వయవార్ధిచంద్రా! కోడల నంటుటపాపము సజ్జనపధంబునబొమ్ము. సత్కీర్తి నందుము.

రావ—నీవావులతో నాకవసరములేదు. రమ్ము. (బలవంతముగ దీసికొనిపోవును)

వజ్ర—ఈముండరోగంకుదిరినది. (నిష్క్రమించును)

నలకూబరుఁడు—(ప్రవేశించి) ఏమీ! చాలపొద్దెక్కినది. ప్రియసియగు రంభయిం తింతకును రాలేదు. కారణమేమోకదా. ఎన్నఁడును నింతయాలస్యము చేసియె ఉుంగదు. (ప్రక్కలఁజూచి) అదిగో! స్త్రీయార్తస్వరంబు వినవచ్చుచున్నది. ఎవ్వరిదోకదా (పరికించి) ఎవరోయనుకొంటిని. నాకాంతయగురంభయే. ఏమి కారణమో ఇట్లేడ్చుచున్నది.

రంభ—(ప్రవేశించి నలకూబరుని కాళ్లపైఁబడి) ప్రాణేశ్వరా! రక్షింపుము. రక్షింపుము.

నల—రమణీ! నిన్నింతగాసిజేసినదురాత్ముం డెవఁడు?

రంభ—నాథా! ఏమిచెప్పుదును. నేనునీసన్నిధానంబునకు వచ్చుచుండ, రావణుండు దారియందు నాకడ్డమై యెంతవేఁడికొన్నను వినక స్త్రీయొంటిగాఁగనుపించినచో దుర్మార్గుండేమియొనరించునో అట్టికార్యంబాచరించె. నాయపరాధంబు క్షమింపుము.

నల—(కోపముతో) ఆదురాత్మా! దశకంధరా! నాతపోబలంబైన నెఱుంగక యిట్టి యకార్యముచేసితివిగా! ఎమిరా! నీసాహసము. ఓరీ! క్రూరా! దైత్యాన్వయబడబానల్గా! నిన్నుభస్మీభూతముసేయుట నాకొక్క త్రుటికాలము. బంధుద్రోహీ! నీవిప్పుడాచరించిన దుష్కార్యంబున కిదేశాపమిచ్చుచున్నాఁడ "నిన్నొల్లని సతులను నీవెప్పుడుపరాభవింతువో, యప్పుడు నీతిలపగులుఁగాక" (రంభనుజూచి) విచారింపకుము. రమ్ము. పోదము. (నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





# శ్రీ రా మ జ న న ము.

## చతుర్థాంకము.

[విష్ణులోకము—అగస్త్యుఁడు—దుర్వాసుఁడు ప్రవేశించుచున్నారు]

అగ—దుర్వాసా !

తే॥ గీ॥ దానవేంద్రుఁడు బెట్టు బాధలనునెల్ల
విన్నవించి ప్రోవుమటంచు ♦ వేఁడికొనిన
గావకుండునె మనలను ♦ గరుణబూని
వివిధదానవమదహారి ♦ విష్ణుమూర్తి.

దుర్వా—భక్తజనవత్సలుండగు శ్రీమన్నారాయణుండు మనల నేలరక్షింపక యుండును. ఇదివఱకెన్నిసారు లనేక యవతారంబుల నెత్తి యెంతమందిమృక్కడిరక్కసుల నుక్కడఁగించి మనలను, నమరులను రక్షింపలేదు. ఇదిగో ! మనము నారాయణుని సౌధంబునుజొచ్చినాము.

అగ—

మ॥ హరి ! నారాయణ ! యిందిరాధవ ! విచిత్రాత్యద్భుతాశ్చర్య భా
స్కరకోటి ప్రవికాస సన్మకుట ! రా ♦ కాచంద్రబింబాననా
సురసంసేవిత పాదపద్మయుగళా ♦ శుద్ధాత్మ త్రైలోక్యసుం
దర పీతాంబర దీనపోష గుణసాంద్రా సర్వలోకేశ్వరా !

దుర్వా—

శా॥ ఘోరాఘోరనృసింహరూప సుజనస్తోత్రార్హ పాదాంబుజా
పారావార సుతామనోరమణ శ్రీ ♦ ప్రహ్లాదసంరక్షణా

ధీరోదార హిరణ్యకశ్యపువధో • దేశోగ్ర దంష్ట్రాకరా
ళా రావే మము బ్రోవవేగమె సు•చేలా ! భక్తరక్షామణీ.

(అంత తెరలేచును)

[విష్ణుమూర్తి ప్రవేశించును]

విష్ణు—మునీంద్రులారా ! భవత్పాదపంకేరుహంబులకు నమస్కరింపుచున్నాడ.

అగ—సకలకల్యాణసౌభాగ్యములచేఁ దులదూగుచు చతుర్దశభువనాధీశుండవై, సృష్టిస్థితిలయ కారణభూతుండవై, నిఖిలమునిజనసురగణసంసేవ్యమానుండవై యొసఁగు నిన్నేమని యాశీర్వదింపఁగలము.

విష్ణు—తాపసోత్తములారా ! ఆయాసనంబుల నధిష్ఠింపుడు.

మునులు—(ఆసీనులగుచున్నారు)

విష్ణు—తే॥ గీ॥ కారణంబేమిలే కరు•దేర రెవ్వరు
పావనత్వము గాంచె మ•న్మందిరంబు
మీయభీష్టంబులను దీర్చి • మేలు నెప్పుడు
సేయనున్నాఁడ మీదగు • సేవకుండు.

అగ—సర్వలోకాధినాథుండవగు నీకుఁదెలియనిదేమున్నది ? సర్వంబు నెఱింగియు మా చే నెఱుంగఁ దలఁచి యిట్లడుగుదువు.

దుర్వా—

శా॥ మీనంబై జలరాసి జొచ్చియును బ•ల్మిన్ సోమకున్ దున్మించి, వే
దానీకంబులు దెచ్చి యబ్జభవు శ•క్రాదుల్సుఖంబంది బ్ర
హ్మానందంబును బొందనిచ్చిన కృపాం•భోరాశి వీవెంచగా
నే నిన్నెట్లు స్తుతింపఁజాలుదును దం•డిశ్రీ శ్రీరమానాయకా.

అగ—తే॥ గీ॥ అమరులును దానవులును న•య్యమృతమ నకుఁ
గడఁగి కలహంబు సలుపంగఁ • గరుణబూని
మందరంబెత్తినాడ వా • నందమెసఁగ

దివ్యకూర్మంబ వగుచును ♦ దేవతలకు
నమృతము నొసంగితీవు మ♦హానుభావ.

దుర్వా—

మ॥ కనకాక్షుండు వధూటికిం గోరికకునై ♦ క్ష్మాచక్రముం జాపచు
ట్టినచందంబునఁ జుట్టుచుండగని కుం♦ఠీభూత చిత్తంబుతో
జనసంతాప నివారణంబునకునై ♦ సౌకర్యరూపంబునన్
దనుజుం దుంపఁగఁజాలితీవు గుణసాం♦ద్రా భక్తచింతామణీ.

అ—

శా॥ గంభీరంబగురూపుఁ గోడ నసురున్ ♦ ఖండింపగా నెంచి శ్రీ
యంభోజాసనరుద్రులాదిగ నమా♦నాశ్చర్యముం బొందగా
స్తంభంబందున నుద్భవంబయి మహా ♦ శౌర్యంబునన్ దానవున్
దంభంబొప్ప వధించలేదె గుణసాం♦ద్రా లోకరత్నామణీ.

దుర్వా—

మ॥ వటుగా యీతఁడటంచు నెల్లజగముల్ ♦ వర్ణింప బ్రహ్మాదులున్
గడువర్ణింపఁగ దానవేంద్రుబలిని ం♦గానంగ నేతెంచి. మూ
డడుగుల్ దానమువేఁడి పుచ్చుకొని భూ♦మ్యాది త్రిలోకంబులున్
లలిదేవేంద్రున కిచ్చియుంటివి ఘనా♦హ్లాదంబు సంధిల్లగన్.

విష్ణు—మహాత్ములారా! ఇదియంతయుఁ దమయాశీర్వచనప్రభావమే నేనుమీకారుణ్యాపాత్రుండను గాని శ్లాఘాపాత్రుఁడను గాను.

దుర్వా—నిఖిలలోకేశ్వరుండవగునీవు, చేసిన ఘనకార్యంబులనుగూర్చి చెప్పకొందువా!

విష్ణు—మునికులతిలకులారా! నాయందుఁ గరుణాంతరంగులరై తామరుదెంచినకార్యంబును సెలవిచ్చి నన్నుఁ గృతార్థునిగాఁ జేయ వేఁడుచున్నాఁడ.

అగ—జగద్రక్షకా! నీవుమాసంతాపంబును బాపుదువని తలంచి యిట్లరుదెంచితిమి.

విష్ణు—అగస్త్యమునీంద్రా; నీపలుకు గడుపింతగనున్నది.

తే॥ గీ॥ భళిర యఱచేతియందు సప్తాంబుధులను
నమరులెల్లరు నాశ్చర్య మందునట్లు
దాల్పఁగాఁజాలిన విపుల తపసివీవు
ఏల కలిగెను సంతాప మిపుడు నీకు.

అగ — సంతాపమందుచుండుట నేనొక్కఁడనే కాదు. సకలమునీంద్రులును తమతమ తపంబులు విడిచిపెట్టి యెక్కడికేని పారిపోవలసివచ్చినది.

దుర్వా —

మ॥ ఘనకారుణ్యకటాక్షవీక్షణసుధాకల్లోలపాథోధివై
మునులన్ గావఁగ దేవతానికరమున్ బ్రోవంగ వేళయ్యె నీ
కనులం దెర్వఁగను చక్రిమానుము జగత్కల్యాణసంధాయకా
దనుజశ్రేణిని దుమ్రింపుమీ వర దిగంతఖ్యాతిఁ జేపట్టుమీ.

విష్ణు — ఏమేమి! మానిచంద్రులారా! రాక్షసబాధయంతయధికంబుగనున్నదా! మహాతపోగరిష్ఠులగు మిమ్ము హింసించుచున్న యాతుచ్ఛదానవుం డెవండు?

అగ — నారాయణా! నీవెఱింగియుండియు, మమ్మడిగెదవేల? సర్వలోకకంటకుండగు రావణుండే.

దుర్వా — బ్రహ్మవరంబునంజేసి, మునులను దేవతలను లక్ష్యపెట్టక కడుదర్పించియున్నాడు.

విష్ణు — ఆదానవుండు మీకంత సంతాపంబును గూర్చుచుండెనా?

అగ — లక్ష్మీమనోహరా! ఏమని చెప్పఁగలము. ఒకమునీంద్రునిఁబట్టి యూర్ధ్వపుండ్రము నాకుచుండును. వేరొక్కనిబట్టి జన్నిదంబు ద్రెంచును. మఱియొక్కని గడ్డంబుబట్టిలాగును. ఒకనివిదన్నను నొకనిపైనవియును. దేవా! ఇదియనియు నదియనియు చెప్పఁజాలము.

విష్ణు — పాపము.

దుర్వా — దేవా! ఈతండొక్కఁడేకాదు. ఈతనిపుత్రుండును తమ్ముండును నట్టివారె. అందు గుంభకర్ణుని దలంచుకొనినచో గుండెలు బ్రద్దలగును. దిగ్గజకుంభంబుల నిక్కలుజేయును. బాహుకండూతిదీర్చికొనుటకై కుధరంబుల పెకలించును. భానుని బట్టనెంచును నరులను మ్రింగుచుండెను. అయ్యో! మహానుభావా! ఏమిచెప్పుదును. మాయార్తిఁదీర్చి మమ్ముద్ధరింపుము.

[అంత దేవదూతయగు జయంధరుఁడు ప్రవేశించును]

జయం—(తనలో)

మ॥ వనమందుండి మహోమ్మదంబున దపో♦భావంబుతో నెప్పుడున్
దినముల్ బుచ్చుచునుండు మౌనివరు ల♦ర్థింజూడలేనట్టి శ్రీ
సనకాద్యుత్తమమౌనిపూజితపదా♦బ్జాతున్ రమాదారునిన్
వనజాతాసనవంద్యు జూచితిని నా ♦ భాగ్యంబు సామాన్యమే.

తే॥ గీ॥ సంగరంబున బడినట్టి ♦ శ్రమమదెల్ల
సమసిపోయెను నేటిలో ♦ విమలచరితు
బంకజాక్షుని దర్శన ♦ భాగ్యమునను
సార్థకంబయ్యె నిపుడు నా ♦ జన్మమరయ.

ఇంక నేనాలసింప నేల? శీఘ్రంబుగ నితనిసన్నిధకేగి దేవేంద్రుని సందేశంబును దెలిపెద. (సమీపించి) ఆహా! నేనుమంచిసమయంబునకేవచ్చితిని. మునీశ్వరులును రావణాసురపీడితులై యిచ్చటకువచ్చిరని తోఁచుచున్నది.

దుర్వా—దేవదూతయగు జయంధరుఁడుకూడ వచ్చియున్నాఁడు.

జయం——అఖిలలోకరక్షకుండగు శ్రీమన్నారాయణ దివ్యపదారవిందంబులకు దేవదూతయగు జయంధరుండు నమస్కరింపుచున్నాడు.

విష్ణు—దేవదూతకు జయమగుఁగాక! (ఇంచుకయూరకుండి) జయంధరా!

శా॥ ఉన్నాడా బలసూదనుండిపుడు దా ♦ నుత్సాహియై కాంతతోఁ
జెన్నారంగను నాజయుంతసుతుఁడున్ ♦ క్షేమంబెకా! దైత్యులున్
సన్నాహంబున వచ్చియుండరుకదా ♦ శౌర్యంబు దీపింపఁగా
నన్నా! విందును వేగఁజెప్పగదవ♦య్యా! నీదుసందేశమున్.

జయం——అయ్యో! ఏమనివిన్నవింతును.

ఉ॥ మొన్ననె రావణుండు పరి♦పూర్ణభుజావిభవంబుజూపుచున్
గ్రన్ననవచ్చి మాపయికి ♦ గౌర్యమటంచును నెంచకుండగా
మన్ననగల్గు నందనము ♦ బారగదోలెను దేవతాతతిన్
విన్నపమేమొనర్తు భుజ♦వీర్యునిబంధన జేసె నింద్రునిన్.

విష్ణు— (ఆతురతతో) ఏమేమి! ఇప్పుడింద్రుండు బంధింపఁబడియున్నవాఁడా?

జయం— దేవా! లేదు లేదు.

తే॥ గీ॥ మొదట బంధించి కొంపోవ ♦ పిదప బ్రహ్మ
కరుణఁబూని రావణసుతు ♦ కడకు జేరి
దివ్యమైన వరమునిచ్చి ♦ దేవనాథుఁ
దోడి తెచ్చెను నేమందు ♦ దోయజాక్ష.

దేవా! ఆసునాశీరుండు దేవరతో విన్నవింప నాకిట్టులాజ్ఞనొసంగెను. నేఁజెప్పబోవునవి శచీనాథుని వాక్యంబులు.

సీ॥ మునిచంద్రులతిభక్తి ♦ ఘనముగాఁ గొల్చు ప
దాంబుజంబులకు దం♦డంబులనుము
అవతారములనెత్తి ♦ యమరారులనుగూల్చి
మమ్ముగాపాడుట ♦ మఱువననుము
దానవాధముఁడైన ♦ దశశిరస్కుఁడుబెట్టు
శ్రమలన్ని చెప్ప న♦శక్యమనుము
దివ్యమునీంద్రుల ♦ దేవతానికరంబు
వీక్షింపఁ గృపతోడ ♦ వేళయనుము
తే॥ గీ॥ నియ్యెడను గూల్ప నవతార ♦ మెత్తుమనుము
నార్యవంద్యునకిది కొద్ది ♦ కార్యమనుము
విబుధపతి యెంతయో విల♦పించెననుము
నిపుడు భారంబునతనిపై ♦ నిడితిననుము.

దుర్వా— మాధవా! వింటిరికదా. మేముపడుచున్నపాట్లకు దేవదూతపలుకులుగూడ ప్రబలసాక్ష్యమిచ్చుచున్నవి.

విష్ణు— దేవమునిహితార్థమై యెట్టిదుష్కర కార్యంబైనను నేను సంతోషంబుతో గావించెదను. మునీంద్రులారా! సంతాపమందవలదు.

మ॥ దశదిగ్భాములుఁ బ్రతాపమహిమల్ ♦ దట్టంబుగానిండ, న
ద్దశకంఠుఁ సమరాంగణంబునను దో♦ర్దర్పంబునంగూల్తు నా
యసుర శ్రేణి భయంబునంది గడు నా♦హాకారముల్సేయగా
వెసమర్త్యాకృతి స్వీకరించి యవనిఁ ♦ వెల్గొందెదఁ దప్పకఁ.

అగ—లక్ష్మీరమణా! నీవు మర్త్యాకృతిస్వీకరించెదవని చెప్పినంతనే మాకెంతయో సంతోషంబుజనించి రావణుఁడు మడిసినట్లే భావింపుచుంటిమి.

దుర్వా—ముకుందా! భూలోకంబున సాకేతపురాధీశుండగు దశరథుండు సంతానమునకై యిప్పుడశ్వమేధయాగంబుసేయుచున్నాఁడు. పుత్రకామేష్టిగూడజేయును.

విష్ణు—తపోధనా! ఈసంగతి సమయమునకే జ్ఞప్తికిదెచ్చితివి. అమ్మహారాజు కడుసత్యసంధుఁడును ధర్మపరిపాలకుఁడునునై వెలఁగుచున్నాఁడు. కావున నేను జనింపఁదగినతావదియే. నేనాతనికి నాల్గురూపంబులను బుత్రుండనై వెలుఁగొంది, రావణునిపుత్రామాత్యభృత్యాదివర్గంబుతోఁగూడ సంగ్రామరంగంబున దునుమాడి మిమ్మును బృందారకులను రక్షించెదను. సంతాపమువీడి మీయాశ్రమంబులకుఁజనుఁడు.

దుర్వా—ఇప్పుడుకదా మాకానందముకలిగినది. భక్తవత్సలా భారంబంతయునీయదియే. ఇంకమాకనుజ్ఞనిమ్ము.

(దుర్వాసుఁడు అగస్త్యుఁడు నిష్క్రమింతురు)

విష్ణు—(జయంధరునిజూచి) దేవదూతా! జయంధరా; నీవిందునిపాలికేగి,

సీ॥ శిష్టులరక్షింప ♦ దుష్టులశిక్షింప భూరిదీక్షనెపుడు ♦ బూనితనుము
మానులనమరుల♦బాధలఁ ముంచెడిదుష్టుండు తప్పక♦త్రుళ్ళునుము
ధర్మవ్రతుండైన♦దశరథక్ష్మాపాలు పుత్రుండనై భూమిఁ♦బుట్టుదనుము
అమరకంటకుఁడైన♦నాదశాస్యుని రణ క్షోణిలో ద్వరలోన♦గూల్తుననుము
తే॥ గీ॥ మానసంబునఁ గడుచింత ♦ మానుమనుము
పృథ్విని నదానవంబు గా♦వింతుననుము
నాది భారమటంచును ♦ నమ్మమనుము
నీవు దేవనాథునికడ ♦ కింకఁజనుము.

జయం—మహాప్రసాదము.

ఇది చతుర్థాంకము.



# శ్రీ రామ జనన నము.

## పంచమాంకము.

### సరయూతీరము.

[యాగశాల—దశరథుఁడు, వసిష్ఠుఁడు మొదలగువారు ప్రవేశించుచున్నారు]

వసి—తే॥ గీ॥ అశ్వమేధయాగంబును ♦ నాచరించి
దేవతల దన్పినాడవు ♦ దివ్యమతిని
పుత్రికామేష్టిప్రితము ని♦ప్పుడొనరించి
నందనోదయభాగ్యంబు ♦ నందఁగలవు.

దశ—మహాత్మా! ఇదియంతయుఁ దమప్రసాదమే.

వసి—(ప్రక్కలంజూచి) ఆహా! అక్కడ నగ్నియెంతదివ్యముగఁ బ్రజ్వరిల్లుచున్నదో (ఆశ్చర్యమున) చూడుము. చూడుము. ఎవఁడో యొకదివ్యపురుషుం డందు దేజరిల్లుచున్నాడు.

[తెరలో]

దశరథా! నేను ప్రాజాపత్యపురుషుఁడ. దేవతలపంపున నిన్ను గాంచవచ్చితిని.

దశ—(ఇంచుకనడచి) మహాత్మా! ఏమిసెలవు?

[తెరలో]

దేవతావరప్రసాదమగు నీపాయసహేమకలశంబును స్వీకరించి యిందుండుపాయసంబును, త్వదీయకాంతలకు సమానంబుగబంచిపెట్టుము. నీకునందనులుగలుగుదురు.

దశ—మహాప్రసాదము. (పాయసకలశంబును గైకొని)

సీ॥ ఇదికదా సుదినంబు ♦ తుదిలేని నాచిత్త
సంతాపమెల్లను ♦ సమసిపోయె
ఇదికదా సుదినంబు ♦ ముదముతోఁ యాగంబు
నాచరించినఫలం ♦ బందినాఁడ
ఇదికదా సుదినంబు ♦ మదనారి సత్కృపా
భాగ్యవిశేషంబు ♦ బడయఁగంటి
ఇదికదా సుదినంబు ♦ హృదయమందు సుతులు
బుట్టినట్టులె తల♦పోయుచుంటి
తే॥ గీ॥ మీకృపాకటాక్షమున న♦మేయులార
సార్థకంబయ్యెను మదీయ ♦ జన్మమిపుడు
తలనుయెత్తి మెలఁగఁగంటి ♦ ధరణిపతుల
యెదుట నెంతైననిప్డు ము♦నీంద్రులార.

వసి—దశరథా! నీవెంతయుధన్యుండవు. దేవతలు నీవొనరించిన క్రతువునకు సంతసిం చి, యీపాయసమంపినారు. ఇంకనీవు జాగుసేయక త్వదీయకాంతలకు భుజిపఁబెట్టుము.

దశ—మహాప్రసాదము.

(నిష్క్రమించుచున్నారు

రంగము—దశరథునిమందిరము.

[తెరపో]

ఓహో! పురజనులారా మీరందరుసరిగావినండి. దశరథమహారాజుగారికి పుట్టినకొమాళ్ళకు యియ్యాలవసిష్టులోరు పేర్లెడ్తారుగనుక మీరందరు వుత్సమచూడానికి రావలశినదోహో!

[తరువాత పుత్రసమేతంబుగా దశరథుఁడు, వసిష్ఠుఁడు ప్రవేశించుచున్నారు)

వసి—దశరథా! రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను నలువురతనయులంగంటివి. నీకోరికలెల్లఫలించె. ఇంకనేమికావలయును?

దశ—మహాత్మా! పరమేశ్వరుని సత్కృపచేతను, భవదాశీర్వచన కారణంబునను దన యంలంగను మహాభాగ్యంబబ్బెను. ఇంక నేమికావలయును ? అయిననునిట్లగుఁగాక !

తే॥ గీ॥ వర్షములు కుంభవృష్టిగ ♦ వరలుఁగాక
ధరణిసస్యసమృద్ధియై ♦ తనరుఁగాక
క్ష్మాపతులు సంతతంబును ♦ బ్రజలయందు
బుత్రవాత్సల్యమెంతో చూ♦పుదురుఁగాక॥

వసి—అగుఁగాక ! (నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము.




